# బ్రహ్మవిద్యా వైభవము




mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.





Like us to follow
@mohanpublications

శ్రీః

# బ్రహ్మవిద్యావైభవము



ఓం సత్యమేవజయతే

★

భారతీసంప్రదాయసార్వభౌమ
జగద్గురు శ్రీకల్యాణానందభారతీమహాంతాచార్యస్వాములవారు.

★

శ్రీ విద్యాశంకరభవనము, గర్తపురి.
చైత్ర శుక్ల పౌర్ణమి.
1950.

 [మూల్యము 8 అణాలు

శ్రీ

# బ్రహ్మ విద్యా వైభవము

నారాయణ సమారంభాం విద్యాశంకర మధ్యమామ్ ।
శ్రీబోధానంద పర్యన్తాం వందే గురుపరంపరామ్ ॥

---

## ౧. "సత్యమేవ జయతే"

భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీ మహాంతాచార్య స్వాములవారు, గర్తపురి.

★

భారతీయులమగు మనము స్వస్తి శ్రీ విరోధినామ సంవత్సర మాఘ శుక్లాష్టమీ గురువారము ది 26-1-1950 భీష్మాష్టమి యను పవిత్రదినమున నుదయము పదిగంటల పదినిముసములకు ననఁగాఁ గుంభలగ్నమున, సావరిన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ Sovereign Democratic Republic అను గౌరవ నామముతో సర్వతంత్ర స్వతంత్రపూరితమగు "భారత సంస్థానమును" సంస్థాపనము చేసియున్నారము.

ఇట్టి సర్వతంత్ర స్వతంత్ర పూరితమగు భారత సంస్థాన మున సకల వేద శిరోవతంసమును సకల వేద సారభూతమును పరమ పవిత్రము నగు వేదమాతయొక్క "సత్యమేవ జయతే" యను హితోపదేశమును భారతీయులమగు మనమందరమును నిత్యమగు నాదర్శముగా గ్రహించి యట్టి వేదమాత యుపదేశించిన సత్యరథమును బవిత్రతమంబగు ధ్వజముగా నాశ్రయించి భారత సంస్థానమంతటను నెలకొల్పియున్నారము. ఇట్లు నెలకొల్పుటయందు మనకుంగల పరమ తాత్పర్యమేమన, వేద మాత దనప్రియపుత్రులగు భారతీయులు నిరంతరమెట్టి భావముతోఁ దమజీవితములనుబవిత్రములుగఁ జేసికొనుచు నాముష్మిక నిశ్శ్రేయసముల నప్రతిహతముగఁ బొందుటయే కాక యుల్లోకములందును భారతీయౌన్నత్యము జగజ్జేగీయమానముగఁ బ్రకాశించుచుండునట్లుఁ దమజీవితముల ధారవోసి సర్వవిధముల వ్యవహరించుటయే యని ప్రత్యేకముగాఁ జెప్ప నవసరము లేదు.

మనచేఁ బ్రకృతమున నిత్యమగు నాదర్శముగా గ్రహింపఁ బడిన వేదమాత యొక్క మహోపదేశము "సత్యమేవ జయతే" యను మహావాక్యమును బవిత్రముగా గ్రహింపఁ బడిన సత్యరథమును సకలవేద శిరోవతంసమగు ముండకోపనిషత్తునందు దుపదేశింపఁబడియున్నదనుట యొక వింత యెంత మాత్రమునుగాదు.

"సత్యమేవ జయతే" యను మహావాక్యము ముండకోపనిషత్తునందలి మూఁడవ ముండకము ప్రథమఖండమునందు

నాఱవమంత్రమునందు మొట్టమొదటి వాక్యముగా వినవచ్చు
చున్నది. అట్టి మంత్ర మెద్దియన:— "సత్యమేవ జయతే
నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః । యేనాక్రమన్త్యృ
షయో హ్యాప్తకామా యత్రతత్సత్యస్య పరమంనిధాన"మ్మని ॥

ఇఁక సత్యరథమన్ననో రెండవముండకము రెండవ
ఖండమున నాఱవమంత్రము నందు మొదటి వాక్యముచే నుప
దేశింపఁబడుచున్నది. ఎట్లనిన— "అరా ఇవరథనాభౌ సంహతా
యత్రనాడ్యః స ఏషో ऽన్తశ్చరతే బహుధా జాయమానః । ఓమి
త్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తివః పారాయ తమసః
పరస్తా"త్తని—

ఇట్లు నిత్యాదర్శ ప్రబోధకముగ — "సత్యమేవ జయతే"
యను మహావాక్యమును, పవిత్రధ్వజముగ సత్యరథము నాశ్ర
యించుటచే సకల వేద శిరస్సులందును మకుటముగాఁ బ్రకా
శించుచున్న ముండకోపనిషత్తును భారతీయులకుఁ బ్రమాణ
రాజముగాఁ బ్రదర్శించుచు నట్టియుపనిషన్మాతయొక్క మహో
పదేశమును భారతీయులెల్లరును బరమ ప్రమాణముగాఁ గ్రహించి
ఐహికాముష్మిక నిశ్శ్రేయసములను యథాధికారము పొంది
తమ జీవితములను సార్థకము జేసి భారతీయౌన్నత్యము ముల్లోక
ములందును భారతీయులెల్లరును బ్రకాశింపఁజేయుదురు గాక!
యను మహాశయముతో భారతసంస్థాన మీరెండిటిని భారతీ
యుల శ్రోత్రపథమునందును చక్షుఃపథమునందు నుండునట్లు
సంస్థాపనముఁ జేసినట్లెల్లరును సుకరముగ గ్రహింపఁగల్గిన

విషయమే. కావున నీమహావాక్యము యొక్కయు, ధ్వజను యొక్కయు నర్థము సర్వజనులకు సుగమముగాఁగ ముండకోపనిషత్తాత్పర్యము నిచట ప్రప్రథమమున సంక్షేపముగ వ్యాఖ్యానమును జేయుచున్నారము. భారతీయులెల్లరును బ్రహ్మజ్ఞానమును గనియెదరుగాక !

## — ముండకోపనిషత్తాత్పర్యము —

అతిశయము:— కలిద్వాపర సంధియందు భారత సంస్థానమును నభివృద్ధినొందించిన భారతీసంప్రదాయ సార్వభౌమ శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులు భారత సంస్థానాభ్యుచ్ఛ్రయము నుద్దేశించి ప్రస్థానత్రయమను పేరఁ బరగు గ్రంథరాజములఁ బరమ ప్రమాణములుగా శాసించి యట్టి ప్రస్థానత్రయమును నవిచ్ఛిన్నపారంపర్యక్రమమున నధీతి బోధాచరణంబులచే భారతీయు లాశ్రయించునట్లును శాసనమును గావించియున్నారలు.

అట్టిప్రస్థానత్రయము-శ్రుతిప్రస్థానము, స్మృతిప్రస్థానము సూత్రప్రస్థానమను సార్థకనామముచే నాటంగోలె నేటివఱకును ప్రకాశించుచునేయున్నది. అందుశ్రుతి ప్రస్థానమనిన-ఋగ్వేదమునకుఁజెందిన నైతరేయోపనిషత్తు, యజుర్వేదమునకుఁజెందినట్టి ఈశ కఠ తైత్తిరి బృహదారణ్యక శ్వేతాశ్వతరములనెడి యైదుపనిషత్తులు, సామవేదమునకుఁజెందిన కేన ఛాందోగ్యములను రెండుపనిషత్తులు, అథర్వవేదమునకుఁజెందిన ముండక ప్రశ్న

మాండూక్య నృసింహతాపినులను నాలుగుపనిషత్తులును. - అను పన్రెండుపనిషత్తులు.

స్మృతిప్రస్థానమున మనుస్మృతియు భగవద్గీతయునను రెండును, సూత్రప్రస్థానమున జైమినీయమగు ధర్మమీమాంసా శాస్త్రము, శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాస భగవత్ప్రణీత మగు వేదాన్తమీమాంసాశాస్త్రమును. ఇట్టి పదునాలు గ్రంథరాజములందును మనుస్మృతి ధర్మమీమాంసయను రెంటికిఁ దక్క- తదితరములగు పదునాలుగు గ్రంథములకును శ్రీ విద్యాశంకరభగవత్పాదు ల్రప్రతిహతమగు భాష్యము లనెడి వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. అట్టి భాష్యములతో పాటు పై ప్రస్థానత్రయమును భారతభూమియందు నెలకొల్పుటయే భారతీ సంప్రదాయమునకుఁ బరమపవిత్రమగు విధి. ఇట్టి ప్రస్థాన త్రయంబునందు నథర్వశాఖకుఁ జెందిన ముండక ప్రశ్న మాండూ క్యముల నెడి యుపనిషత్త్రియమును నగ్రగణ్యముగ నలరారు చున్నది. అందు ముండకముమూలగ్రంథము. ప్రశ్నముతద్వ్యా ఖ్యానము. మాండూక్యము తత్సారభూతమగురహస్యవిశేషము. ముండకమన్నచో సకలవేదసమధిగతమును రహస్యమునగువిశేష మునంతను సమగ్రముగను సంక్షేపముగను సింహావలోకనముతో నుపదేశించుచున్నది.

పేరు:- ఈ యుపనిషత్తునకు ముండకమను నామము. ఈ యుపనిషత్తు నధ్యయనముఁ జేయునపుడ తప్పక యవశ్యమాచరింప వలసిన శిరోవ్రతము ననుసరించి కలిగిన పేరు. ఏతద్విశేష మీ

యుపనిషత్తునందలి యుపాంత్యశ్లోకముచే నిట్లు ప్రదర్శింపఁబడి యున్నది.

"తదేత దృచాభ్యుక్తమ్ - క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయన్తః। తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణ"మ్మని ॥ముం॥ 3।౨।౧౦

ఏతద్విషయమే యంత్యశ్లోకముచేఁగూడఁ బ్రదర్శింపఁ బడుచున్నది.

"తదేతత్సత్యమృషి రఙ్గిరాః పురోవాచ నైతదచీర్ణ వ్రతోఽధీతే నమః పరమ ఋషిభ్యో నమః పరమఋషిభ్యః" యని.

శిరోవ్రతమ్మన శిరస్సునందు నగ్నిని ధరించునట్టి లక్షణ ముగల వ్రతము. ఇయ్యది ఆథర్వణులయొక్క వేదవ్రతము లందుఁ దెలియవచ్చెడిని. ఇంక నుపనిషత్తను శబ్దము విషయము ప్రయోజనమును వ్యక్తీకరించునట్టి విశేషపదము. అద్దానికి బ్రహ్మవిద్యయని యర్థము. ఈ శబ్దార్థవిశేషము 'ఉపని' అను నుపసర్గములు పూర్వముగాఁగల 'షద్ల' ధాత్వర్థము వలనఁ దెలియవచ్చెడిని. ఏతద్విషయమంతయు గ్రంథస్థవిషయ విజ్ఞానమువలనఁ దెలియనచ్చెడిని. కావున సంక్షేపముగ గ్రంథస్థ విశేషము ప్రదర్శింపఁబడుచున్నది.

మొదటి ముండకము మొదటి ఖండము మంత్రములు తొమ్మిది.

1. బ్రహ్మవిద్యా సంప్రదాయము:— ఉపనిషత్తనిన బ్రహ్మవిద్యయని చెప్పఁబడియె. విద్య యనునది పురుషులనాశ్రయించి యుండెడిదిగాని వేరొకవిధమునఁ దెలియవచ్చెడి దెంతమాత్రమును గాదు. కావున బ్రహ్మవిద్యకు నిదానమగు బ్రహ్మవిద్యాసంప్రదాయము మొట్టమొదటి మూఁడుశ్లోకముల చేతను దిఙ్మాత్రముగఁ బ్రదర్శింపఁబడినది.—

“బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్యకర్తా
భువనస్య గోప్తా। స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా మథ
ర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ ॥౧॥

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽథర్వా తాం పురో
వాచాఙ్గిరే బ్రహ్మవిద్యామ్। స భారద్వాజాయ సత్యవహాయ
ప్రాహ భారద్వాజోఽఙ్గిరసే పరావరామ్ ॥౨॥

శౌనకో హ వై మహాశాలోఽఙ్గిరసం విధివదుపసన్నః
పప్రచ్ఛ కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥

విశ్వమునకు సృష్టికర్తయు సృజింపఁబడిన భువనమునకుఁ బరిపాలకుఁడును సకలదేవతలలో నగ్రగణ్యుఁడునగు బ్రహ్మ సృష్ట్యాదియందు సరస్వతి దృషద్వతి యను దేవనదుల యన్తరమగు బ్రహ్మావర్తమనెడి దేవనిర్మితదేశమునందు లెస్సగా మూర్తీభావమునొందెను. మూర్తీభావమును జెందిన బ్రహ్మ మహోదారబుద్ధిగలుగఁ బ్రజాకాముఁడై “బహుస్యాం ప్రజాయేయ” యని సంకల్పము గావించి మహామహులగు మానస పుత్రులను బలువురను సృజించెను. అట్లు సృజింపఁబడినపుత్రుల

రొక్కయభ్యుచ్ఛయమునకై మహాదానములలోనగ్రగణ్యమగు బ్రహ్మవిద్యాదానమును గావించెను. బ్రహ్మవిద్య యన్ననో సర్వవిద్యలకును బ్రతిష్ఠయన మూలాధారము నిదానభూతము. అట్లు బ్రహ్మవిద్యాదానమును గ్రహించినవారలలో నొక డథర్వుణుఁ డనువాఁడు. అథర్వుణుఁ డిచట జ్యేష్ఠపుత్రునిగాఁ జెప్పఁబడుటకుఁ దగుకారణము మొట్టమొదటజనించినమానస పుత్రు లందరును జ్యేష్ఠులే యనంబడుదురు. అట్టివారలలో నితరులకుంబోలె జ్యేష్ఠకనిష్ఠత్వ విచారమునకుఁ బ్రసక్తిలేమి నందరును జ్యేష్ఠులేయని ప్రసంగవశమునఁ జెప్పఁబడుదురు. అట్టి సందర్భముచే నిచట నథర్వుణుఁడు జ్యేష్ఠపుత్రుడని పేర్కొనఁ బడియున్నవాఁడు ॥౧॥

ఇటులనే పదిమంది ప్రజాపతులను సృజించినట్లు మనువు నిర్వచించియున్నాఁడు—

"అహం ప్రజాః సిసృక్షుస్తు తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।
పతీన్ప్రజానా మసృజం మహర్షీ నాదితో దశ ॥
మరీచ మత్ర్యఙ్గిరసౌ పులస్త్యం పులహంక్రతుమ్ ।
ప్రచేతసం వసిష్ఠంచ భృగుం నారదమేవచ ॥ యని

ఏతద్విషయమే శ్రీకృష్ణభగవానులచే నిట్లు నిర్వచింపఁ బడియున్నది.

"సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేషవో స్త్విష్టకామ ధుక్"ని—

ఏతద్విషయము సవిస్తరముగా మనుస్మృతి యందలి మొదటి యధ్యాయమున "ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాతమ

లక్షణ"మ్మను నైదవశ్లోకము మొదలు నూటనాల్గవ శ్లోకము న్త
ముగాఁగల నూరుశ్లోకములచే బ్రహ్మవిద్యా సంప్రదాయము
సవిస్తరముగ నిర్వచింపఁబడినది.

అథర్వాణునికొఱకు నే బ్రహ్మవిద్యను బ్రహ్మప్రవచనమును
గావించెనో యట్టి బ్రహ్మవిద్యను నథర్వాణుఁడు పూర్వ మఙ్గి
కొఱకు నుపదేశము చేసెను. అట్టి యఙ్గి భరద్వాజగోత్రుఁడగు
సత్యవహునికొఱకుఁ జెప్పెను. భారద్వాజుఁడగు సత్యవహుఁ
డన్ననో పరంపరాక్రమమునఁ బ్రాప్తమైనట్టియు సర్వవిద్యలకు
నిదానభూతమైనట్టియుఁ బరావరమగు బ్రహ్మవిద్య నఙ్గిరసుని
కొఱకుఁ బ్రవచనమును జేసెను ॥ ౨

ఇట్లుండ నొకనాడు శునకుని పుత్రుఁడును మహాగృహ
స్థుఁడునగు శౌనకుఁడను మహానుభావుఁడు విధిస్పృష్ట విధానమున
నఙ్గిరసుని సమీపమునకు బోయి నాష్టాఙ్గ వన్దన మాచరించి
యిట్లుప్రశ్నించెను.—

"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" యని
షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవగు నో మహానుభావా! ఎయ్యది దెలి
యఁబడుటయందు నీ పరిదృశ్యమానమగు సర్వమును దెలియఁ
బడినదగునో యద్దాని ననుగ్రహింపుమని. ॥3

అట్లుప్రశ్నింప—శౌనకుని కొఱకు నఙ్గిరసుఁడు బ్రహ్మ
విద్య నుపదేశించినట్లు – "తస్మై సహోవాచ" యని చెప్పఁబడు
చున్నది. అట్లు అంగిరసుఁడుప దేశించిన బ్రహ్మవిద్యయే ముండ
కోపనిషత్తనియు, నట్టి బ్రహ్మవిద్యయందలి యుపదేశవాక్యమే

యీ "సత్యమేవ జయతే" యను మహావాక్యమనియు, దానం జేసి ఈ వాక్యాతిశయము నిరతిశయమనియు సర్వవిధములం జెప్పనగును.

ఇచ్చట భారతీయులెల్లరును లెస్సగం దెలిసికొను విశేష మొండుగలదు. అశ్రద్ధియన — ముండకోపనిషత్తునందు బ్రహ్మము మొదలుకొని శౌనకుని వఱకును మాత్రము బ్రహ్మవిద్యా సంప్రదాయము నిర్వచింపంబడియున్నది. ఇటులనే వేద ప్రకరణములందు నచ్చటచ్చట బ్రహ్మవిద్యా వంశములు పేర్కొనంబడియున్నవి. అవియన్నియు నొకానొకచోట నాగి పోయినట్లు వినవచ్చుచున్నవిగదా! నేటివఱకు నవిచ్ఛిన్న పారంపర్యక్రమమున బ్రహ్మవిద్యా సంప్రదాయ మభివృద్ధి నొందుచున్నదా? అద్దాని నెటం దెలియనగుననినచోం జెప్పంబడు చున్నది. ఎచ్చటెచ్చట సంప్రదాయము లేయేక్రమమున వినవచ్చుచున్నను భారతవర్షమునకుం బవిత్రత నొందించు భారతీసంప్రదాయ మగ్రగణ్యముగ నలరారుచు నవిచ్ఛిన్న ముగ సృష్ట్యాదినుండి నేంటివఱకు నభ్యుచ్చయము నొందు చున్నటుల సుప్రసిద్ధమే. ఇట్టి భారతీసంప్రదాయమును గూర్చి విష్ణుపురాణమునందుం బరాశరమహర్షి భారతవర్ష స్వరూప కథనమునందిట్లు నిర్వచించియున్నారలు.—

"ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్।
వర్షం తద్భారతం నామ భారతీ యత్రసంతతీ" యని

ఇట్టి భారతీసంతతి శ్రీ విద్యాశంకర భగవత్పాదుల వఱకు బవిత్రముగను సంక్షేపముగను నిరంతరము బ్రహ్మజిజ్ఞా

నువులచే భారతవర్షంబున నెల్లదిశలందును సంస్మరింపఁబడు చుండుట యెల్లరకును దెలిసినవిషయమే. అట్లు సంస్మరింపఁ బడుచుండు శ్లోకవిశేషమిట్లు పరగుచున్నది.

"నారాయణం పద్మభువంవసిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ
వ్యాసం శుకంగౌడపాదం మహాన్తం గోవిందయోగీంద్ర
మథాస్యశిష్యం
శ్రీ శంకరాచార్య మథాస్యపద్మపాదంచ హస్తామలకంచ
శిష్యం
తంత్రోటకం వార్తికకారమన్యా నస్మద్గురూన్సంతత
మానతోస్మి" యని—

ఈ భారతీసంతతి యన్ననో భారతవర్షమున శ్రీమన్నా రాయణునితోఁ బ్రారంభమై వేదవ్యాస శ్రీకృష్ణద్వైపాయ నులచేఁ గలిద్వాపరసంధియందు నభివృద్ధినొందిపఁబడి శ్రీవిద్యా శంకర భగవత్పాదులచే లెస్సగా స్థాపింపఁబడినట్టియు శ్రీవిద్యా శంకర విద్యారణ్యులవారిచే మఱల నుద్దీపితమైనట్టియుఁ బ్రకృ తమున జగద్గురు శ్రీకల్యాణానందభారతీమహాంతాచార్యస్వాముల వారియందును దత్కరకమలసంజాతజగద్గురు శ్రీ సదాశివానంద భారతీస్వాములవారి యందును సర్వవిధముల నిలచియున్నట్టియు బరమహంస పరివ్రాజకాచార్యవర్య సంప్రదాయము. ఇట్టి సంప్రదాయాతిశయమును స్ఫురింపఁజేయుటకే ఈ "సత్యమేవ జయతే" యను మహావాక్యము భారతసంస్థానమునకు నిత్యమగు నాదర్శముగా నెలకొల్పఁబడినదనుటకు నించుకేనియు సంది యము లేదు. అట్టి పరమానందముతో బవిత్రమగు భారతీ

సంప్రదాయము నిట దిఙ్మాత్రముగఁ బ్రదర్శింపుచున్నారము.

భారతీ సంప్రదాయమునకు మూలపురుషునిఁ గూర్చి మనుస్మృతి యిట్లు పల్కుచున్నది.

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః।
తాయ దస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః
య త్తత్కారణ మవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్।
తద్విసృష్టః సపురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే॥ యని.

భారతీసంప్రదాయమునకు మూలపురుషుఁడు

శ్రీ మ దా ది నా రా య ణుఁ డు

|

సర్వలోకపితామహుఁడగు బ్రహ్మ

|

వసిష్ఠుఁడు

|

శక్తి

|

పరాశరుఁడు

|

శ్రీ వేదవ్యాస శ్రీకృష్ణద్వైపాయన భారతి

|

శ్రీశుకులు

|

శ్రీ గౌడపాదాచార్యులు

|

శ్రీగోవింద భగవత్పాదాచార్యులు

|

కలి ౨౫౭౩ శ్రీవిద్యాశంకర భగవత్పాద భారతి క్రీ. పూ. 509

|

శ్రీ సురేశ్వర భారతి  క్రీ. పూ. 483

|

శ్రీ విద్యాశంకర విద్యారణ్య భారతి

1. శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వరులు క్రీ.వె. 1336-1386

|

32. శ్రీ ఉద్దండ భారతి  క్రీ. వె. 1794

|

35. శ్రీఅభినవోద్దండ బోధానంద విద్యాశంకరభారతి ,, 1825

|

39. శ్రీవిద్యాశంకర నృసింహభారతి (ఉద్దండభారతి)1878-1896

|

40. శ్రీ విద్యానృసింహశంకర భారతి ,, 1896-1906

|

41. జగద్గురు శ్రీబోధానంద భారతి 1906-1923

|

42. జగద్గురు శ్రీకల్యాణానంద భారతి 1907-

శ్రీ విద్యాశంకర భవనము, గర్తపురి.

|

43. జగద్గురు శ్రీ సదాశివానంద భారతి 1947-

శ్రీ సదనమ్, గర్తపురి.

బ్రహ్మవిద్య:— మహాశాలుఁడగు శౌనకుఁడు విధిదృష్ట విధానంబున నఙ్గిరసుని కడకుఁబోయి ప్రార్థింప నాయఙ్గిరసుఁడు శౌనకునికొఱకు బ్రహ్మవిద్యోపదేశమును సూత్రప్రాయంబుగ నిట్లుచేసెను.—

"ద్వే విద్యే వేదితవ్యే ఇతిహాస్మ యద్బ్రహ్మవిదో వదన్తి
పరా చైవాపరా చ"-

అజీరసుఁడు దాఁ జేయుచున్న యుపదేశము స్వకపోల కల్పిత విశేషమును స్వాభీష్టనిర్వాహణమునకై సమయోచితముగ నెద్దియో యొక విధమునఁ బల్కినట్టి వంచకోక్తులెంత మాత్రమునుగాక దనకు నవిచ్ఛిన్నపారంపర్యక్రమమున జగత్కర్తయును జగత్పరిపాలకుఁడునగు బ్రహ్మముఖము నుండి పురుషనిశ్వాసమట్లు అప్రయత్నముగా వెలువడినట్టియును బ్రహ్మవిత్తులెల్లరును నపరిహతముగను నకలంకముగను నధీతి బోధాచరణములచేఁ బ్రబోధమును గావించునట్టియుఁ విద్యావిశేషమే యను నతిశయముతో- "హస్మ యద్బ్రహ్మవిదో వదన్తి"యని విద్యావైభవమును సంకీర్తనమును జేసియున్నాఁడు. ఉపదేశ విశేషమేమన నైహికాముష్మిక నిశ్శ్రేయసముల నందగోరు సర్వవిజ్ఞానకాముఁడవశ్యము పరావిద్య యపరావిద్య యని ప్రసిద్ధిఁగాంచిన రెండువిద్యలను నవశ్యము దెలిసికొని తీరవలయునని. ఇచట పరావిద్యయన జ్ఞాననిష్ఠ యనియును, అపరావిద్యయనఁ గర్మనిష్ఠయనియు బ్రహ్మవాదుల యభిప్రాయము. ఏతద్విషయమునే శ్రీకృష్ణభగవానులు—

"లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠాపురాప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్"ని

నిర్వచించియున్నారలు- కర్మనిష్ఠయన నాలుగు వేదములందును మంత్ర బ్రాహ్మణములచే నుపదేశింపఁబడిన నిత్యనైమిత్తిక కామ్యకర్మ విశేషములును శాంతికపౌష్టికకర్మ విశేషములునని

యభిప్రాయము. జ్ఞాననిష్ఠయనునుపనిషత్తులచే నుపదేశింపఁబడు సర్వకర్మసంన్యాసపూర్వక బ్రహ్మనిష్ఠయనియు నభిప్రాయము. ఇట్టి యభిప్రాయము నువ్యక్తముగాఁగ నఙ్గిరసుఁడు—

"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వవేదః శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి। అథపరా యయా తదక్షర మధిగమ్యతే"యని యుపదేశించెను.—

ఇట్లుపదేశించి సర్వోపనిషత్ప్రతిపాద్యమగు నక్షరస్వరూపమును పైనాలుగుశ్లోకములచే నతిగంభీరముగ నుపదేశించెను. ఇయ్యది మొదటి ఖండమునందలి విషయము. ఇఁక రెండవఖండము నందున్నదో "సత్యమేవ జయతే" యని విశ్లేషించి చెప్పఁదలఁచిన మహోపదేశమునందలి సత్యశబ్దార్థమును వివరించుచున్నాఁడు— అందు మొదటిమంత్రమిట్లు సింహగర్జనముతోఁ జెప్పఁబడుచున్నది.—

"తదేతత్సత్యం మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సంతతాని। తాన్యాచరథ నియతం సత్యకామా ఏషవః పన్థాః సుకృతస్య లోకే" యని.

"సత్యమేవ జయతే" యను మహావాక్యమును నిత్యమగు నాదర్శముగా శిరసావహించిన భారతీయులమగు మనలను ఆఙ్గిరసుఁడిట్లు చేయియెత్తి సింహగర్జనముతో శాసించుచున్నాఁడనియే సర్వవిధముల మనము గ్రహింపవలయును. ఏమని శాసించుచున్నాఁడనిన—తదేతత్సత్యం ఆ యీ సుప్రసిద్ధమగు సత్యమననిదియే; ఎయ్యది? కవయః–విద్వాంసులగు బ్రహ్మవాదులు

త్రేతాయాం – ఋగ్యజుస్సామ లక్షణమగు వేదరాశియందలి, మంత్రేషు – మంత్రములందు, బహుధా–నానాప్రకారములుగా సంతతాని – వ్యాపించియుండు, యాని కర్మాణి–ఏకర్మములను, అపశ్యన్–కనిపెట్టిరో, తాని–ఆకర్మములే సత్యమనునది, సత్య కామాః – సత్యమునే నిరంతరముగ నభీష్టముగఁ గోరునట్టి మహానుభావులారా! తాని – అట్టి సత్యమనెడి కర్మములను, నియతం – తప్పక, ఆచరథ–ఆచరింపుడు. ఏషః–ఇట్టి కర్మాచరణమే, వః – మీకు, లోకే–ఈలోకమునందు, సుకృతస్య–పుణ్య కర్మసంబంధమైన, పన్థాః – మార్గము అనఁగా వేదములందు నుపదేశింపఁబడిన కర్మములే సత్యశబ్దవాచ్యములు. అవ్వానిని నియతముగ నాచరించుటయే సత్యకామునికి లక్షణమని తాత్పర్యము.॥ ౧–౨–౧.

ఇట్లు సత్యకాములు సత్యమనెడి కర్మముల నాచరింప వలయునని విధించి యట్టి కర్మములయందు నవశ్యకర్తవ్యములనువాని నాచరింపకపోయినచోఁ గల్గు ననర్థమును, ఆచరించినచోఁగల్గు ఫలవిశేషమును నుత్తరములగు తొమ్మిదిశ్లోకములచే నిర్వచింపఁబడుచున్నది.——

అట్లుప్రతిపాదింపఁబడిన కర్మవిశేషములేవియన——

1. త్రేతాగ్నిసంగ్రహము 2. నిత్యాగ్నిహోత్రము 3. దర్శ 4. పౌర్ణమాసము 5. చాతుర్మాస్యములు 6. ఆగ్రయణము 7. అతిథి పూజనము 8. వైశ్వదేవము 9. జ్యోతిష్టోమము 10. ఇష్టాపూర్తదత్తములును.

ఇట్టికర్మముల నియతముగ నాచరించుచుండుటయే సత్యమనెడు కర్మనిష్ఠ ఇదియే యపరావిద్య. కావున సత్యమన దెలిసి

కొనఁబడవలసిన రెండు విద్యలలోను పరావిద్యయని ముండకో పనిషన్మాత ప్రబోధము గావించుచున్నట్లు సువ్యక్తమయ్యెడిని.

పరావిద్య:- ఇక పరావిద్యచేఁ బొందఁబడునని చెప్పఁ బడినట్టి యక్షరముకూడ సత్యమేయనియు నట్టి పరావిద్యా విషయమగు సత్యమగు నక్షరము నుపదేశము నొందుటకుఁదగు నధికారమును సంపాదింప దలఁచువాఁడేమి సేయవలయునను విశేషము పంౘ్రెండవ మంత్రముచే నిట్లుపదేశింపఁబడుచున్నది.

"పరీక్ష్య లోకాన్కర్మ చితాన్బ్రాహ్మణో నిర్వేదమా యాన్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం సగురు మేవాభి గచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియంబ్రహ్మనిష్ఠమ్" ని॥ ముం౧-౨-౧౨.

బ్రాహ్మణుఁడు కర్మచే సంపాదింపఁబడు లోకములను లెస్సగఁ బరీక్షించి అకృతమనెడి మోక్షమెంత మాత్రమును గర్మచేఁబొందఁబడ నేరదని తెలిసికొని, - నిర్వేదమాయాత్ - తీవ్రమగు వైరాగ్యమును బొందవలయు ననగా సర్వకర్మ సంన్యాసమును గావింపవలయును. అట్లు సర్వకర్మ సంన్యాసము గావించిన బ్రాహ్మణుఁడు, తద్విజ్ఞానార్థం - అట్టి సత్యమనెడి యక్షరమును దెలిసికొనుటకు, సమిత్పాణిః - యథోచితమగు కానుకను జేతియందుఁబట్టుకొని, శ్రోత్రియం - వేద విహితజ్ఞానమునుకలిగి వేదవిహితమగు ననుష్ఠానము నాచరించు చున్నట్టి, బ్రహ్మనిష్ఠం - బ్రహ్మనిష్ఠయందుఁ బూర్ణుఁడైనట్టియు ననఁ బరమహంస పరివ్రాజకాచార్య వర్యుఁడైనట్టి, గురుం - గురువుసన్నిధికి, అభిగచ్ఛేత్ - ప్రార్థనాపురస్సరముగఁ బోవల యును. ఏతద్విషయమునే శ్రీకృష్ణభగవానులు— "తద్విద్ధి

ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా"యని యుపదేశించి యున్నారలు. అట్లు తీవ్రవైరాగ్యముతో సర్వకర్మసంన్యాసి సద్గురువు కడకుఁబోయిన నచ్చట సద్గురువేమిచేయును. అట్టి గురువు వలనఁగల్గు ప్రయోజనమేమి యన నంతిమశ్లోకమగు పదుమూఁడవ శ్లోకముచే నిట్లు చెప్పఁబడియున్నది.

"తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ। యేనాక్షరంపురుషంవేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యా"మ్మని ॥ముం॥ ౧-౨-౧౩.

అట్లు సమీపించినట్టియు, లెస్సగ ప్రశాన్తినిఁజెందిన యంతఃకరణమును గలినట్టియు విద్యార్థికొఱకు, సవిద్వాన్ ఆ శ్రోత్రియుఁడగు బ్రహ్మనిష్ఠుఁడే పరావిద్యచే నక్షరమును పురుషుఁడునగు సత్యమును దెలిసికొనునో యట్టి బ్రహ్మవిద్యను బ్రహ్మభావముతోఁ బుష్కలముగ నుపదేశించును. ఇచ్చట సత్యమైన నక్షరమగు బ్రహ్మమేయని యర్థము. ఏతదర్థము నే "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"యను తైత్తిరీయోపనిషత్తుగూడ నుద్ఘోషించుచున్నది. భారతసంస్థానము "సత్యమేవ జయతే" యను మహావాక్యమును నిత్యమగు నాదర్శముగ శిరసావహించి ముండకోపనిషన్మాత యొక్క ప్రామాణ్యభావమును బ్రకటించుటచే నట్టి ముండకోపనిషత్తునందుఁ బ్రదర్శింపఁబడిన బ్రహ్మవిద్యా సంప్రదాయమున ననాద్యవిచ్ఛిన్న పరంపరాక్రమమున మూర్ధాభిషిక్తులమై భారతభూమియందు నప్రతిహతమగు యశంబును గాంచుచున్న మాయొక్క జగద్గురుత్వమును వెల్లడించి మాకుందుఁగల సూక్ష్మోపదేశాధికారమును బ్రచు

రించి భారతీయౌన్నత్యమును సింహగర్జనముతో నీచతుస్సాగర పరివేష్టితంబగు పృథివియందుఁ బ్రకటించుచుండుటకు మే మపారమగు సత్యానందమును బొంది భారత సంస్థానాభ్యుచ్ఛ్రయము కొఱకు నిరంతరము నారాయణస్మరణంబులఁ జేయు చున్నారము. ఇయ్యది ప్రసంగానుప్రసక్తి — ప్రకృతము ననుస రింతము. ఇయ్యది ప్రథమముండకమునందలి ద్వితీయఖండ విశేషవిషయము. ఏదియన – సత్యమన పరాపరవిద్యలను ద్వైవిధ్యముతో నొప్పారు బ్రహ్మవిద్యయే కాని వేఱొండు ఎంతమాత్రమునుగాదు.

రెండవ ముండకము – మొదటి ఖండము – మొదటి ముండకమున రెండవ ఖండమునందలి యంతిమశ్లోకము – "యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్"ని బ్రహ్మవిద్యకు విషయము సత్యమని చెప్పఁ బడియె. అట్టి సత్యస్వరూపమును బోధించుటకు రెండవ ముండ కము ప్రవర్తింపుచున్నది. అందుమూలశ్లోకము "తదేత త్సత్యం యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులిఙ్గాః సహస్రశః ప్రభవన్తే సరూపాః। తథాక్షరా ద్వివిధాఃసోమ్య భావాః ప్రజాయన్తే తత్రచైవాపి యన్తి" యని ॥ముం॥ ౨-౧-౧.

ఆయీసత్యమన నియ్యదియ – ఎయ్యదియన – లోక ములో లెస్సగాఁ బ్రకాశించుచుండిన యగ్నివలన వేలకొలది సమానరూపములుగల మిణుగురు లుద్భవించుచుండునో యటు లనే నక్షరమగు సత్యమువలన నానావిధములగు భావములు ప్రకృష్టముగఁ బుట్టుచుండును. అట్టి సత్యమునందే లయముఁ

జెందుచుండునని సత్యశబ్దార్థము సదృష్టాంతముగను, సంక్షేపముగను నుపదేశింపఁబడియున్నది. ఈ శ్లోకము మొదటి ముండకము యొక్క మొదటి ఖండమునందలి యేడవశ్లోకానువాదమే. అదెద్దియన—

"యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషధయః సంభవన్తి। యథా సతః పురుషాత్కేశలోమాని తథాఽక్షరాత్సంభవతీహ విశ్వమ్॥ (ముం. ౧-౧-౭)

ఇఁక నీశ్లోకానంతరము పరగు తొమ్మిది శ్లోకములు నీశ్లోకార్థ వివరణమే కాని వేఱొండుగాదు. ఇఁక రెండవ ఖండమున్ననో యట్టి సత్యమును దెలిసికొనుటకు దగు స్థానమును సాధనమును బోధింపఁ బ్రవర్తించుచున్నది. అందు మొదటి రెండుశ్లోకములును మూలశ్లోకములు. అవెవ్వియన— "ఆవిః సంనిహితం గుహాచరం నామ మహత్పదమత్రైతత్సమర్పితమ్। ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానామ్ (ముం. ౨-౨-౧) యదర్చిమద్యదణుభ్యోఽణు చ యస్మింల్లోకా నిహితా లోకినశ్చ। తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః। తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి" యని ॥ముం. ౨-౨-౨॥

ఇచ్చట నైదు చరణములుగలవు. అందు మొదటి నాలుగు చరణములును సత్యస్వరూపమును నట్టి సత్యము నన్వేషణమును జేయుస్థానమును బోధింపుచున్నవి. అట్టి నాలుగు చరణములచేతను సత్యమునే యుపదేశించి యద్దానిని "తదేతత్సత్యమ్మ"ని పూర్వమునందు వలెనే నిర్వచించి -

యయ్యాదియే యమృతమనియు నయ్యాదియు - "తద్వేదితవ్యమ్"- యనశ్యము దెలిసికొనఁబడవలయుననియు, దానంజేసియద్దాని "సోమ్యవిద్ధి"యని శౌనకునకు నఙ్గిరసుఁడు విధించుచున్నాఁడు. దానంజేసి శౌనకుని స్థానమున నున్న భారతీయులనందరను శాసించుచున్నాఁడని యర్థము - పిమ్మట మూఁడుశ్లోకములచే "తద్వేదితవ్యమ్మ"ను విషయము నొక రూపకముతో బోధించి - జిజ్ఞాసువులకు సత్యస్వరూపము సుకరముగ బుద్ధికి గోచరమగు నట్లుపదేశింప నొక యుపమానపురస్సరముగ సత్యస్వరూపము నుపదేశించుచున్నాడు. అట్టి యుపమానమునందు దృష్టాంత ముగ నొకచక్రమిట్లు ప్రదర్శింపఁబడియున్నది. ——

"అరా ఇవ రథనాభౌ సంహతా యత్రనాడ్యః స ఏషోఽ న్తశ్చరతే బహుధా జాయమాన"యని.

చక్రమన "భావవ్యంజకం రేఖా రూపమ్మ"ని చక్ర కోవిదులు సెప్పుచున్నారు. ఇక్కడ సత్యభావవ్యంజకమగు రేఖారూపమునకు స్వరూపజ్ఞాపకమగు సంకేతము రథమని. కావున నిచట నుపదేశింపఁబడిన చక్రమునకు సత్యరథమని బ్రహ్మవాదుల యొక్క సంకేతము. ఇది యట్లుండ బృహదా రణ్యకమున 'సత్యమే ధర్మము ధర్మమేసత్య'మని యొక యుప దేశమిట్లు గలదు.

"స నైవ వ్యభవత్తచ్ఛ్రేయోరూప మత్యసృజ్యత ధర్మం తదేతత్ క్షత్రస్య క్షత్రం యద్ధర్మ స్తస్మాద్ధర్మాత్పరం నాస్త్యథో అబలీయాన్బలీయాంస మాశంసతే ధర్మేణ యథా రాజ్ఞైవం యో వై సధర్మః సత్యం వై తత్తస్మాత్సత్యం వద న్తమాహుర్ధర్మం

వదతీతి ధర్మం వదన్తగ్ం సత్యం వదతీత్యేతద్ధ్యేవైతదుభయం భవతి"యని (బృహ. ౧।౪।౧౪॥)

దానంజేసి యీచక్రమును ధర్మరథమనికూడఁ జెప్ప నొప్పును. బృహదారణ్యకమందుఁగూడ సత్యము ముండకోపనిషత్తునందువలెనే యట్టి దృష్టాన్తముచేతనే యిట్లుపదేశింపఁబడియున్నది.—

"స యథోర్ణనాభిస్తన్తునోచ్చరేద్యథాఽగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చరన్త్యేవమేవాస్మాదాత్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి తస్యోపనిషత్సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేష సత్యమ్"ని (బృహ॥ ౨।౧।౨౦)

అంతియకాదు. ఈసత్యరథము లేక ధర్మరథము బృహదారణ్యకమునందుఁగూడ నిట్లుపదేశింపఁబడియున్నది.—

"స వా అయమాత్మా సర్వేషాం భూతానామధిపతిః సర్వేషాం భూతానాగ్ం రాజా తద్యథా రథనాభౌ చ రథనేమౌ చారాః సమర్పితా ఏవమేవాస్మిన్నాత్మని సర్వాణి భూతాని సర్వే దేవాః సర్వే లోకాః సర్వే ప్రాణాః సర్వ ఏత ఆత్మానః సమర్పితాః"యని (బృహ. ౨।౫।౧౫).

ఇఁక ముండకోపనిషద్వ్యాఖ్యానమగు ప్రశ్నోపనిషత్తునందు నీసత్యరథ మిట్లుపదేశింపఁబడియున్నది.—

"అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్। ఋచో యజూగ్ంషి సామాని యజ్ఞః క్షత్త్రం బ్రహ్మచ"యని.

ఇటులనే కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తునందు నింద్ర ప్రతర్దనాఖ్యాయిక యందు నీరథమిట్లు నిర్వచింపఁబడియున్నది-

"తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞా మాత్రాః ప్రాణే అర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా"యని (కౌ. షీ. 3/౮). ఇచటఁ బ్రాణశబ్దము బ్రహ్మపరమన సత్య పరమే యని సుస్పష్టము.

ఇట్లు రథ దృష్టాంతముతో 'సత్యమును' దెలియఁజెప్పి యంతిమశ్లోకముచే నాసత్యము సర్వవ్యాపకమగు బ్రహ్మమే యని యిట్లు నిర్వచింపఁబడినది.——

"బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ। అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠ"మ్మని ॥ముం. ౨।౨।౧౨.

దానంజేసి యీరథము బ్రహ్మరథమనిగూడఁ జెప్పఁ బడుచున్నది. ఇంతియకాదు- ప్రశ్నోపనిషత్తునందలి యాఱవ ప్రశ్నమునందలి యైదవ మంత్రమునందిట్లు రథము నిర్వచింపఁ బడి, యేడవమంత్రముచే బ్రహ్మజ్ఞాన ముపసంహారము చేయు టచే నియ్యది బ్రహ్మరథ మనఁబడుచున్నది. అదెట్లన——

"అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ప్రతిష్ఠితాః। తం వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః పరివ్యథా

ఇతి॥ ప్రశ్న ౬।౬॥

తాన్స్వా చైతాన దేవాహమేతత్పరం బ్రహ్మవేద నాతఃపరమ స్తీతి. యని ॥ ప్రశ్న ౬ । ౭ ॥

ఇట్లు రెండవ ముండకమున రెండవఖండము రథదృష్టాన్త పురస్సరముగ సత్యమును బ్రహ్మమును బోధించుచున్నది.

ఇఁక మూఁడవముండకమున ప్రథమఖండమునఁబూర్వమునం దుపదేశింపఁబడిన సత్యాఖ్యబ్రహ్మమును దెలిసికొనుటకు సాధనముల నుపదేశించుచు నందు సత్యముయొక్క ప్రాశస్త్యమును బోధింప నీరెండు మంత్రములు నుపదేశింపఁబడి యున్నవి—

"సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్। అన్తఃశరీరే జ్యోతిర్మయోహి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః॥ (ముం. 3 । ౧ । ౫).

సత్యమేవ జయతే నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః । యేనాక్రమ న్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్"॥ (ముం. 3 । ౧ । ౬).

ఈ యాఱవమంత్రమునందు— 'సత్యమేవ', 'సత్యేన' 'సత్యస్య పరమం నిధానం' అని సత్యశబ్దము ప్రత్యయభేదముచే మూఁడుమారు లుచ్చరింపఁబడియున్నది. ఇఁక నీఖండమునందలి తరువాత నాలుగు మంత్రములును రెండవఖండమునందలి మొదటి తొమ్మిది మంత్రములును సత్యముచే సత్యముయొక్క పరమంబగు నిధానమును బొందువానికిఁ గల్గు మహాఫలములను ప్రబోధించుచున్నవి. ఇట్లు అఙ్గిరసుఁడు శౌనకునకు జెప్పవలసిన బ్రహ్మవిద్యనంతయును జెప్పినటుల యుపనిషన్మాత యిట్లు ముల్లోకములకును సింహగర్జనముచేఁ బ్రకటింపుచున్నది.

"తదేతత్సత్య మృషిరఙ్గిరాః పురోవాచ" యని.

ముం. ౩ । ౨ । ౧౧.

అనగా మహర్షియగు నఙ్గిరసుఁ డుపదేశముఁ జేసినట్టి యాసత్య మిదియే యని. అనఁగా— " ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మ విదో వదన్తి పరాచైవాపరాచ " యని. చెప్పఁబడిన పరావిద్యయు నపరావిద్యయు నను రెండువిద్యలే సత్యమనునది. అట్టి సత్యము నాశ్రయించి యాచరించువాఁడే యిచట— 'సత్యమేవ జయతే' యను మహావాక్యమునందలి సత్యశబ్దవాచ్యుఁడు.

అట్టి సత్యశబ్దవాచ్యుడే ' జయతే ' – ముల్లోకములను జయించును. ' నానృతం ' – అనృతము సత్యముకంటె భిన్నమును సత్యవిరుద్ధమును సత్యవిదూరమునగున దెద్దియైనను. అట్టి యనృతము నాశ్రయించినవాడు 'న జయతే' ఇహలోకమునందే యించుకేనియుఁ బ్రయోజనమును బొందనేఱఁడు. ఇఁక పరలోకమున్నుగూర్చి చెప్పవలసిన విషయమే లేదు. అన నిహాపరముల రెండింటికిని నత్యంతము దూరమగుటయే కాక సర్వవిధముల భ్రంశమును జెందునని యర్థము.— ఇయ్యది ముండకోపనిషత్తుయొక్క పరమతాత్పర్యము.

ముండకోపనిషత్తునందలి యాఱుఖండములును గొన్ని శ్లోకములను మూలముగాఁగల్గి తదితరములగు శ్లోకములన్నియు వ్యాఖ్యానముగాఁ బరగుచున్నవి. అట్టి మూలశ్లోకము లిచట ననాయాసముగాఁ దాత్పర్యమును జనువరులు గ్రహించుటకు సంగ్రహముఁ జేయఁబడుచున్నవి—

## — ముండకోపనిషన్మంత్రాలు —

1. ఓమ్ - బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా
భువనస్య గోప్తా । స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠా మథ
ర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ॥ ౧।౧।౧

2. అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽథర్వా తాం పురోవా
చాఙ్గిరే బ్రహ్మవిద్యామ్।స భారద్వాజాయ సత్యవహాయ
ప్రాహ భారద్వాజోఽఙ్గిరసే పరావరామ్॥ ౨

3. శౌనకో హ వై మహాశాలోఽఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ।
కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి॥ ౩

4. తస్మై స హోవాచ । ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ
యద్బ్రహ్మవిదో వదన్తి పరా చైవాపరా చ॥ ౪

5. తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వ
వేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి।
అథ పరా యయా తదక్షర మధిగమ్యతే॥ ౫

6. యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః
శ్రోత్రం తదపాణి పాదం । నిత్యం విభుం సర్వగతం సు
సూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి
ధీరాః॥ ౬

7. యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా
మోషధయః సంభవన్తి । యథా సతః పురుషాత్కేశ
లోమాని తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్॥ ౧।౧।౭

8. తదేతత్సత్యం మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యం
స్తాని త్రేతాయాం బహుధా సంతతాని। తాన్యాచరథని
యతం సత్యకామా ఏషవః పన్థాః సుకృతస్యలోకే॥ ౧-౨-౧

9. తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్ష
చర్యాం చరన్తః। సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి
యత్రామృతః సపురుషో హ్యవ్యయాత్మా॥ ౧-౨-౧౨.

10. పరీక్ష్యలోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేద మాయా
న్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం సగురుమేవాభి
గచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥ ౧-౨-౧౨

11. తస్మై సవిద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ
శమాన్వితాయ। యేనాక్షరం పురుషం వేద సత్యంప్రోవాచ
తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥ ౧।౨।౧౩

12. తదేతత్సత్యం యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులిఙ్గాః।
సహస్రశః ప్రభవన్తే సరూపాః। తథాఽక్షరాద్వివిధాః
సోమ్య భావాః ప్రజాయన్తే తత్రచైవాపి యన్తి॥౨-౧।౧

13. ఆవిః సంన్నిహితం గుహాచరం నామ మహత్పదమత్రైతత్
సమర్పితమ్। ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సద
సద్వరేణ్యం పరం విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానామ్॥ ౨।౨।౧

14. యదర్చిమద్యదణుభ్యోఽణు చ యస్మింల్లోకా నిహితా
లోకినశ్చ। తదేతదక్షరం బ్రహ్మ సప్రాణస్తదు వాఙ్మనః।
తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి॥ ౨।౨।౨

15. అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషోఽ
న్తశ్చరతే బహుధా జాయమానః । ఓమిత్యేవం ధ్యాయథ
ఆత్మానం స్వస్తివః పారాయ తమసః పరస్తాత్ ॥ ౨।౨।౬

16. బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ
దక్షిణతశ్చోత్తరేణ । అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మై
వేదం విశ్వమిదం వరిష్ఠమ్ ॥ ౨।౨।౧౧

17. సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేనబ్రహ్మ
చర్యేణ నిత్యమ్ । అన్తఃశరీరే జ్యోతిర్మయోహి శుభ్రో
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥ 3-౧-౫.

18. సత్యమేవ జయతే నానృతం సత్యేన పన్థా వితతో దేవ
యానః । యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర
తత్సత్యస్య పరమం నిధానమ్ ॥ 3-౧-౬.

19. తదేతత్సత్య మృషి రఙ్గిరాః పురోవాచ నైతదచీర్ణ
వ్రతోఽధీతే । నమః పరమ ఋషిభ్యో నమః పరమ
ఋషిభ్యః॥ 3-౨-౧౧.

— స త్య ర థ ము —

ఇంతవఱకును గ్రంథసందర్భముచే 'సత్యమేవ జయతే'
యనుమహావాక్యార్థము సువ్యక్తముగాఁగఁ దద్వ్యాఖ్యానమగు

ముండకోపనిషత్తాత్పర్య మొకింత సంక్షేపముగఁ బ్రదర్శింపఁ బడినది. మహావాక్యార్థమును సుగమముగఁ దెలియఁ జేయు మూలశ్లోకములు పందొమ్మిది ప్రత్యేకముగాఁ బ్రదర్శింపఁ బడినవి. అందు పదునైదవవాక్య మిట్లు వరగుచున్నది.—

"అరా ఇవ రథనాభౌ సంహతా యత్రనాడ్యః స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః । ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తివః పారాయ తమసః పరస్తాత్"ని.

ఏతద్వ్యాఖ్యార్థానువాదములుగ ప్రశ్నోపనిషత్తునందలి రెండవప్రశ్నమునందును నాఱవ ప్రశ్నమునందును గ్రమముగా నీ రెండు శ్లోకములును వినవచ్చుచున్నవి.—

"అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్ ।
ఋచో యజూగ్ంషి సామాని యజ్ఞః క్షత్త్రం బ్రహ్మచ॥
ప్రశ్న ౨ । ౬

"అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ప్రతిష్ఠితాః । తం వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః పరివ్యథా ఇతి"
ప్రశ్న. ౬ । ౬.

ఇంక నీ సత్య రథ మితరములగు నుపనిషత్తులందుఁ గూడ నుపదేశింపఁబడి యున్నదని చెప్పఁబడియె. ఇట్టి సత్య రథముచే గ్రహింపదగు నర్థము విపులమగుటచే నద్దానిఁ గరతలామలకముగఁ బ్రబోధింప సూత్రములు మాచేఁ బ్రవర్తింపఁ జేయఁబడినవి. అవ్వాని నిటఁ బొందుపఱచుచున్నారము.—



'सत्यमेव जयते'



— స త్య ర థః —

1. అథాత స్సత్యరథం వ్యాఖ్యాస్యామః ।
2. సత్యరథ స్సైవ ధర్మరథో దేవరథో బ్రహ్మరథ ఇతి విజ్ఞాయతే ॥
3. అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితం । ఋచో యజూగ్ంషి సామాని యజ్ఞః క్షత్త్రం బ్రహ్మచ తస్యైవ వ్యాఖ్యానమ్ ।
4. తద్ధి బిందుద్వయ చతుర్వింశతి రేఖా వృత్తద్వయ చక్ర రూపమ్ ।
5. తత్ర పరిధిద్వయంతు మాయాశక్తి స్సదాశివా ।
6. బిందుద్వయం తూపనిషత్ ।

7. బిందుద్వయ పరిధిద్వయయోర్మధ్య ఏవ హ్యాశోఽ ఇతి విజ్ఞాయతే।

8. తత్రాధ్యస్తా చతుర్వింశతి రేఖాకలాఽపి సదాశివా।

9. తద్భిన్న మధిష్ఠానం సదాశివమండల మితి సంకీర్త్యతే।

10. సైవ కలాసత్య కలే త్యపిచ।

11. సర్వేషా మప్యధిష్ఠానం సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మేతి శ్రూయతే।

12. తస్యోపనిష దహారిత్యహామితి చ వాజసనేయినస్సమామనన్తి।

13. ఓమిత్యేతదితి సర్వే వేదా స్సర్వాణి తపాంసిచ।

14. స ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి।

15. చతుర్వింశతి రేఖా కలాఽభవత్।

16. సైవ చతుర్వింశత్యక్షరా గాయత్రీతి విజ్ఞాయతే।

17. అత్రకలా సదాశివా పరిధిస్సదాశివో మండలం సదాశివం బిందుస్సదాశివోఽతస్సర్వం సదాశివమితి విజ్ఞాయతే।

18. అతస్సర్వం ఖల్విదం సత్యం సదాశివం బ్రహ్మైవ।

19. తద్విజ్ఞానా దేవ తు పురుషార్థసిద్ధిః పురుషార్థసిద్ధిః॥

ఇతి నారాయణ స్మృతిః



## — సత్యవిగ్రహము —

ఇంతవఱకు భారతసంస్థానముచేఁ బ్రకటింపఁబడిన "The Constitution of India" యను గ్రంథముయొక్క ముఖ పత్రమునందు దేవనాగరీ లిపిలో ముద్రింపఁబడిన "సత్యమేవ జయతే" యను ముండకోపనిషన్మహావాక్యార్థమును తదర్థము నభివ్యంజకమునుజేయు సత్యరథచక్ర వ్యాఖ్యానమును సంక్షే పముగఁ బ్రదర్శింపఁబడియె. ప్రకృతమున నట్టి ముఖపత్రము నందు ముద్రింపఁబడిన "సత్యమేవ జయతే" యను మహా వాక్యమునకు నత్యంతసంనిహితముగ ముద్రింపఁబడిన సత్య విగ్రహముచే స్ఫురింపఁజేయఁబడు నర్థము నొకింతఁ బ్రదర్శించె దము. సత్యవిగ్రహస్వరూపము "సత్యమేవ జయతే" యను మహావాక్యమునకు నత్యంత సంనిహితముగ నొక పీఠము నొప్పుచున్నది. అట్టి పీఠమునందలి మధ్యభాగమున బిందుద్వయ చతుర్వింశతి రేఖావృత్తద్వయ చక్రరూపమగు సత్యరథము చిత్రింపఁబడియున్నది. ఈ సత్యరథమునే ధర్మరథమనియు దేవరథమనియు బ్రహ్మరథమనియును వేదములు వల్కు చున్నవి. ఇట్టి చక్రమునకు దక్షిణపక్షమున నొకయశ్వమును ఉత్తరపక్షమున నొక కామధేనువును జిత్రింపఁబడియున్నవి. ఇట్టి ప్రకల్పనముచే స్ఫురించు నర్థవిశేష మెద్దియన.—

సత్యరథముచే "సత్యంజ్ఞాన మనన్తం బ్రహ్మ" యను శ్రుతిచే బ్రతిపాదింపఁబడు బ్రహ్మము స్ఫురింపఁజేయఁబడును.

అశ్వము:— అశ్వముచే నట్టి బ్రహ్మము యొక్క మూర్తీభావమగు ప్రజాపతి స్ఫురింపఁజేయఁబడుచున్నాడు.

ఏలయన నశ్వము ప్రజాపతి దేవతాకము. వేయేల ప్రజాపతి సదృశమే యని వేదము లుద్ఘోషించుచున్నవి. అట్టి వేద ప్రబోధములలో నగ్రగణ్యము బృహదారణ్యకోపనిషత్తునందలి మూడవ యధ్యాయమునందలి, మొదటి బ్రాహ్మణమునందలి మొదటియనువాకము, – అుద్దియన—

"ఉషా వా అశ్వస్య మేధ్యస్య శిరః। సూర్యశ్చక్షుర్వాతః ప్రాణో వ్యాత్తమగ్నిర్వైశ్వానరః సంవత్సర ఆత్మాఽశ్వస్య మేధ్యస్య। ద్యౌః పృష్ఠ మన్తరిక్షముదరం పృథివీ పాజస్యం దిశః పార్శ్వే అవాన్తరదిశః పర్శవఋతవోఽఙ్గాని మాసాశ్చార్ధమాసాశ్చ పర్వాణ్యహోరాత్రాణి ప్రతిష్ఠా నక్షత్రాణ్యస్థీని నభోమాంసాని। ఊవధ్యం సికతాః సింధవో గుదా యకృచ్చ క్లోమానశ్చ పర్వతా ఓషధయశ్చ వనస్పతయశ్చ లోమాన్యుద్యన్పూర్వార్ధో నిమ్లోచఞ్జఘనార్ధో యద్విజృంభతే తద్విద్యోతతే యద్విధూనుతే తత్స్తనయతి యన్మేహతి తద్వర్షతి వాగేవాస్య వాక్॥ బృహ. ౩।౧।౧.

కామధేనువు;– కామధేనువన ముండకోపనిషత్తునందు నపరావిద్యయని నిర్వచింపఁబడిన – ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, వ్యాకరణము, కల్పము, నిరుక్తము, ఛన్దస్సుజ్యోతిషమనునవి. ఇయ్యది బ్రహ్మమువలన నిః శ్వాసములు బయలువెడలెనని మైత్రేయీ బ్రాహ్మణ ముపదేశించుచున్నది.—

"స యథార్ద్రైధాగ్నేరభ్యాహితస్య పృథగ్ధూమా విని శ్చరన్త్యేవం వా అరేఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేత

ద్యద్పృగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాన్యస్యైవైతాని నిశ్వసితాని" యని.

ఏతద్విషయమునే ముండకోపనిషత్తుగూడ నిట్లు ప్రదర్శించుచున్నది.

"తస్మాదృచః సామ యజూంషి దీక్షా యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ। సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమో యత్ర పవతే యత్రసూర్య"యని ॥ ముం॥ ౨।౧।౬.

ఏతద్విషయమునే శ్రీకృష్ణభగవానులిట్లు నిర్వచించి యున్నారలు.—

"స హాయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః। అనేన ప్రసవిష్యధ్వ మేషవోస్త్విష్ట కామధుక్కు"ని. గీ॥ 3॥౧౦

ఇచ్చట 'ఇష్టకామధు'క్కన - మనయొక్క సకలాభీష్టముల నొసంగు కామధేనువని యర్థము. ఇచ్చట కామధేనువన యజ్ఞములను నవ్వానిని బోధించు వేదములు నని యర్థము.—

ఇయ్యది అశ్వము వలనను కామధేనువువలనను గ్రహింపబడవలసిన విశేషములు - ఇట్టి విశేషములవలన నీ పీఠమును బ్రహ్మపీఠమనియు ప్రతిష్ఠయనియుఁ జెప్పనగును.

<u>సింహాత్రయము:—</u> ఇఁక నీబ్రహ్మపీఠము నాధారముగఁ జేసికొని యాధేయముగ నొకే మూర్తిమంతముగ నగుపడునట్లు

సామరస్యముగ నలంకరింపఁబడిన మూఁడు సింహములతో నొప్పు విగ్రహ విశేషము చిత్రింపఁబడియున్నది. ఇట్టి ప్రకల్పనమువలన నన్యోన్యసామరస్యముగల మూఁడు విశేషములు చతుష్పాత్తులందు సింహములట్లు, ద్విపాత్తులగు నరులందు (Citizens) నప్రతిహతతేజముతో బ్రహ్మమువలన సృజింపఁబడినట్లు దప్పక స్ఫూర్తిగల్గును. అట్టి సింహత్రయము సృష్టి వైచిత్ర్యమునుబట్టి వైచిత్ర్యమును బొందుచు భారతీయౌన్నత్యమునకు జ్ఞాపకమగుచున్నది. అట్టి వైత్ర్యవిశేషమును శ్రుతి స్మృతి సదాచారప్రమాణాను ప్రాణితముగఁ బ్రదర్శింపుచున్నారము.



## — సత్యవిగ్రహః —

1. అథాతః సత్యవిగ్రహం వ్యాఖ్యాస్యామః ।

2. భూర్భువస్సువరితి వా ఏతా స్తిస్రో వ్యాహృతయః ॥

3. తాసాము హస్మైతాం చతుర్థీం ॥ మాహాచమస్యః ప్రవేదయతే ॥ మహఇతి । తద్బ్రహ్మ । స ఆత్మా । స రథః । అఙ్గాన్యన్యా దేవతాః ॥

4. ప్రజాపతి ర్వా అశ్వః । యజ్ఞో వై కామధేనుః ॥

5. భూరితివా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షం, సువరిత్యసౌ లోకః । మహఇత్యాదిత్యః । ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయన్తే ॥

6. భూరితి వా అగ్నిః । భువ ఇతి వాయుః । సువరిత్యాదిత్యః ।
మహ ఇతి చంద్రమాః । చంద్రమసా వావ సర్వాణిజ్యోతీగ్ంషి
మహీయన్తే ॥

7. భూరితి వా ఋచః । భువ ఇతి సామాని । సువరితి యజూ
గ్ంషి । మహ ఇతి బ్రహ్మ । బ్రహ్మణా వావ సర్వే వేదా
మహీయన్తే ॥

8. భూరితి వై ప్రాణః । భువ ఇత్యపానః । సువరితి వ్యానః ॥
మహ ఇత్యన్నం । అన్నేన వావ సర్వే ప్రాణా మహీయన్తే॥

9. అథాతః సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః ॥

10. పంచస్వధికరణేషు । అధిలోక మధి జ్యౌతిష మధివిద్య
మధిప్రజ మధ్యాత్మమ్ ॥

11. అథాధిలోకమ్ । పృథివీపూర్వరూపమ్ । ద్యౌ రుత్తర
రూపమ్ । ఆకాశస్సన్ధిః । వాయుః సన్ధానం ॥

12. అథాధిజ్యౌతిషమ్ । అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య
ఉత్తర రూపమ్ । ఆపః సన్ధిః । వైద్యుతః సన్ధానమ్ ॥
అథాధి విద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్ । అన్తేవాస్యు
త్తర రూపమ్ । విద్యాసన్ధిః । ప్రవచనగ్ం సన్ధానమ్ ॥

14. అథాధిప్రజమ్ । మాతా పూర్వరూపమ్ । పితోత్తర
రూపమ్ । ప్రజాసన్ధిః । ప్రజననగ్ం సన్ధానమ్ ॥

15. అథాధ్యాత్మమ్ । అధరాహనుః పూర్వరూపమ్ । ఉత్త
రాహనురుత్తరరూపమ్ । వాక్సన్ధిః । జిహ్వా సన్ధానమ్ ॥

16. తత్ర మృగేన్ద్రా అన్యోన్య సంశ్లిష్టాః ॥

17. త్రయో ధర్మస్కన్ధా యజ్ఞోఽధ్యయనం దానమితి ॥

18. త్రయో వర్ణా ద్విజాతయో బ్రాహ్మణః క్షత్రియో
వైశ్య ఇతి ॥

19. త్రయ ఆశ్రమా బ్రహ్మచర్యం గార్హస్థ్యం సంన్యాసమితి ॥
20. మాత్రాశ్చ పాదా అకార ఉకార మకార ఇతి ॥
21. తథా తద్భర్గోధియ ఇతిచ ॥
22. బ్రహ్మవిష్ణు మహేశ్వరా ఋషయః ॥
23. మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యస్తిస్రో దేవతాః ॥
24. త్రీణి ఛన్దాంసి గాయత్ర్యుష్ణిగనుష్టుబితి ॥
25. శ్రుతిః స్మృతిః సూత్రమితి ప్రస్థానాని ప్రస్థానాని ॥

ఇట్టి సింహత్రయముచే భారత వర్షీయాన్నత్యద్యోతకములగు విశేషములు స్ఫూర్తికి వచ్చుచుండును. ఇట్టి విశేషము లన్నియును సర్వశబ్దవాచ్యములగు పరావిద్యయొక్కయు నపరావిద్యయొక్కయు వైచిత్ర్య విశేషములే యని వేఱఁజెప్పనక్కరలేదు. ఇట్టి పరాపరవిద్యావైభవమే బ్రహ్మవిద్యావైభవమనియును నద్యాదియే భారతీయాన్నత్యమనియును భారత నరులకు (Citizens) నాదర్శముగాఁ బ్రబోధమును జేయు సత్యవిగ్రహము సర్వనరులకును బ్రతిక్షణమును నేమరుపాటులేకుండ బుద్ధియందు భాసింపఁజేయ 'ఒక రూపాయి' కాగితమునఁ జక్కగ ముద్రింపఁబడియున్నది. దానంజేసి యీసత్యవిగ్రహదర్శనమాత్రముచే భారతనరుల కెల్లరకును ముండకోపనిషత్ప్రామాణ్యమును నద్దానియందుఁ బ్రదర్శింపఁబడిన బ్రహ్మవిద్యావైభవమగు బ్రహ్మవిద్యా సంప్రదాయాన్నత్యమును పరాపర విభాగముచే నొప్పు బ్రహ్మవిద్యయొక్క విశేషమును బ్రదర్శించుటయే భారతసంస్థానముయొక్క పరమతాత్పర్యమని చెప్పఁదగియును. కావున నట్టి యాదర్శముతో భారతనరులెల్లరును త్రికరణశుద్ధిగ నెల్లకాలములందును వర్తింపుచు

